# గిరీశం మాష్టారు




Ram gopal varma అంటే
ఇష్టపడే వారికోసం
అతని బిహేవియర్
అనాలసిస్......

రవికిషోర్ మల్లాప్రగడ

# గిరీశం మాష్టారు

## రవికిషోర్ మల్లాప్రగడ

**వెల : 69/-**

**Cover Design : Keerthi Pratyusha**

**M.V.K. Ravi Kishore** Ph.D. (Maths)
Asst. Professor,
Yanbu Industrial College,
Saudi Arabia
ravikishorem@yahoo.com
+966501446104
+918074897131

+9181748601

# ముందు మాట

ఈ పుస్తకం నేను ఎందుకు రాస్తున్నాను? నా రైటింగ్ ఎబిలిటితో త్వరగా పాపులర్ అవ్వడం కోసం! RGV ని పైకి తిడుతూనే ఇష్టపడే వాళ్ళు అధికం. పైగా అతని పుస్తకం **'నా ఇష్టం'** చాలా పాపులర్ అయింది. అంటే ఎక్కువ మంది కొన్నారు. పుస్తకాల షాపులోనికి 10,000 మంది వస్తే అందులో ఒక శాతం మంది మాత్రమే అంటే 100 మంది పుస్తకం కొని తమ లైబ్రరీలో పెట్టుకుంటారు. అందులో ఒక శాతం మంది మాత్రమే అంటే ఒక్కరు మాత్రమే ఆ పుస్తకాన్ని పూర్తిగా చదువుతారు. అంటే పుస్తకం చదివేది 1:10,000 అన్నమాట! మరి నా పుస్తకాన్ని ఎంతమంది చదువుతారో?

ఈ గందరగోళ ప్రపంచం అర్థం కాక మరియు అర్థం చేసుకోలేక మనమందరం నెగిటివ్స్‌నే ఇష్టపడతాం. బెర్ముడా ట్రయాంగల్ మిష్టరీ గురించి తెలిసినంతగా Bermuda Triangle Mystery Solved అన్న రిసెర్చ్ పేపర్ గురించి ఎవరికీ తెలియదు. అటువంటి పబ్లికేషన్ ఒకటి ఉన్నదన్న విషయం కూడా జనానికి తెలియదు. ఇదే లాజిక్ తో RGV - B.A. ని రాస్తున్నాను. మరి మనకి నెగిటివ్స్ అంటేనే ఇష్టంకదా! RGV - B.A. అంటే RGV - Behavioural Analysis. ఇంతకు ముందు RGVని చాలా మంది అనలైజ్ చేసి ఉంటారు. కాని ఇది నా అనాలసిస్.

ది పర్పస్ ఆఫ్ ది బుక్ ఏమిటంటే – ప్రతి మనిషికి ICCS (Inferiority, Criticism, Confidence, Satisfaction) ఆత్మ న్యూనత, ఆత్మ విమర్శ, ఆత్మ విశ్వాసం, ఆత్మ తృప్తి అను నాలుగు ఆత్మలు ఉంటాయి. ఆత్మ న్యూనత తక్కువ, ఆత్మ విమర్శ ఎక్కువ ఉన్న RGV గురించి తెలుసుకొని మనని మనం మార్చుకుంటామేమోనని!

– : o : –

# సూచిక

## 1. RGV **ఒక స్వామీజీ**

RGV ఒక స్వామీజీ. RGVకి – స్వామీజీ కి తేడా ఏమిటంటే, స్వామీజీలకు హిపోక్రసీ ఉంటుంది. RGVకి హిపొక్రసీ లేదు. RGVని ANR ఈ క్రింది విధంగా పోస్టర్ వేయించుకోమన్నాడు. "నా మొదటి సినిమా (శివ) హిట్ ఇచ్చిన ప్రేక్షకులకు నా కృతజ్ఞతలు" మనమైతే ANR ని గౌరవిస్తున్నామనుకుంటూ 'అలాగే' అంటాం. పైగా ఏం పోయిందిలే అని మన ఆలోచనా విధానాన్ని సమర్ధించుకుంటాం (trying to rationalize the thinking process). హిపోక్రసీ లేదు కాబట్టే, చాన్స్ ఇచ్చిన (ఇప్పించిన) ANR మాటను గౌరవించలేదు. లోన ఒక ఆలోచన, పైన ఒక ఆలోచన లేనివాడు కాబట్టే – అంటే హిపోక్రసి లేనివాడు కాబట్టే – నా మొదటి సినిమా అని ప్రేక్షకులు హిట్ ఇవ్వలేదు. వాళ్ళకి నచ్చింది కాబట్టి హిట్ చేసారు అని నిజాయితీగా ఆలోచించాడు. దురదృష్టశావత్తు దీనినే మనం బుర్ర తిరుగుడుగా అభివర్ణిస్తాం. హిపోక్రసీ లేకపోతే అహం లేనట్లే! అందుకే RGV తనని అందరూ పేరు పెట్టి పిలవమని అంటాడు. సార్ అనద్దు అని అంటాడు. నమస్కారం పెట్టద్దు అని చెబుతాడు. అహం లేనివాడు జీవితంలో ఎంత ఎత్తు ఎదుగుతాడో మనకు తెలిసిందే! అహం మనల్ని ఎదగనీయకుండా ఆపేస్తుంది. ఏ మూడేళ్ళ చంటి బిడ్డను చూసినా అహం లేని వ్యక్తులు కనిపిస్తారు. RGV మాటలు వింటూ వుంటే మనకి కల్మషం లేని హృదయం కనపడుతుంది. అయితే ఎదిగిన వ్యక్తి అహం లేకుండా స్త్రీల తొడలను వర్ణిస్తుంటే, మనకి ఎక్కడో కాలుతుంది. అతని సహేతుకాన్ని మనం సహించలేం. ఈ వాక్యం చదువుతున్నప్పుడే మీకు చిర్రెత్తుకు రావాలే?

20 ఏళ్ళకే RGV మానవ ఎదుగుదలలో అత్యంత ముఖ్యమైన విషయాలు రెండు కనుక్కున్నాడు. అందుకే అతనిని స్వామీజీ అని అన్నాను. జీవితంలో ఏమీ ప్రాధాన్యత లేనివి, ఎందుకూ ఉపయోగం లేనివి రెండు వస్తువులు – డబ్బు, తిండి. మన సామాజిక పరిబాషలో వ్యక్తిగత ఎదుగుదల అంటే డబ్బు సంపాదించడం. మనం కొనే లగ్జరీలన్నీ డబ్బు ద్వారానే సంప్రాప్తిస్తాయి. అటువంటి డబ్బును త్యజించాలి అని అతి పిన్న వయస్సులోనే RGV తెలుసుకున్నాడు. అందువలనే అతని దగ్గర పనిచేసే చాలా మందికి డబ్బులు ఇవ్వడు. ఇష్టమైతే ఫ్రీగా పని చెయ్యండి అని అంటాడు. ఏ స్వామీజీ ఎక్కడా డబ్బు పే చెయ్యడు. నిజానికి స్వామీజీ బట్టలకు జేబులు కూడా ఉండవ్! మరి అతని అవసరాలన్నీ సమగ్రంగా నెరవేరుతున్నాయే! RGV పాలసీ కూడా అదే. మనం డబ్బు మీద నిజమైన వ్యామోహం వొదులుకుంటే డెబ్బై శాతం మనం RGV అయినట్లే!

స్వామీజీకి ఫాలోయర్స్ ఉంటారు. స్వామీజీని ఏమైనా అంటే మీదపడి కరిచేస్తారు. RGV ఫాలోయర్స్‌లో కూడా కొంతమంది అంతే! RGV విమర్శించే కెపాసిటీ నీకెక్కడది అని అడుగుతారు. మనం ఏదో గాంధీ గారిని విమర్శించినట్టుగా చూస్తారు. నువ్వు సినిమాలు తీసి చూపెట్టవోయ్ అని అంటారు. ఫలానా సినిమాలో హీరో బాగా నటించలేదు అని అనటానికి మనకి యాక్షన్ రానక్కరలేదు. అలాగే  ఫలానా సింగర్ పాడిన పాట మనల్ని రంజింప చేయలేదు అని అనటానికి మనకు సింగింగ్ రానక్కరలేదు. అవి మనకి కనెక్ట్ కాలేదు. అంతే. ఇక్కడ జోక్ ఏమిటంటే ఫాలోయర్స్ రెచ్చిపోతారు – RGV లైట్ గా తీసుకుంటాడు.

స్వామీజీలు ఎక్కడా టెన్షన్ లేనట్లు కనబడుతూ, చిద్విలాసంగా సమాధానం చెబుతుంటారు. రాముఇజంలో RGV కూడా టెన్షన్ తీసుకోకుండా సమాధానం చెబుతుంటాడు. స్వామీజీలు సంఘం బాగుండాలని, అభివృద్ధి చెందాలని, తాము అందుకే పూజలు చేస్తున్నామని కపటం చెబుతారు. కానీ RGV నిజాయితీగా వాటిని కోరుకుంటాడు. ఉదాహరణకు పిల్లలు పుట్టగానే ఒక కమ్యూనిటీ జైలులో పడేసి (మరో ప్రపంచం), తల్లిదండ్రులకు వేరే పిల్లవాడిని ఇచ్చి పెంచమనాలి. అప్పుడు నా అనే స్వార్ధం ప్రబలదు. తద్వారా ప్రక్కదారుల్లో ఆస్తులు సంపాదించరు. ఈ ఐడిలిస్టిక్ ఆలోచన అహాన్ని ఖచ్చితంగా నిర్మూలిస్తుంది. సంఘపరంగా ఆలోచించడం అంటే ఇదే! స్వామీజీలను మనం ఉదాత్తమైన వ్యక్తులుగా గౌరవిస్తాం. స్వామీజీల కంటే దివ్యంగా ఆలోచిస్తాడు కాబట్టే RGV ఒక స్వామీజీ అని అన్నాను. చిద్విలాసంగా, ఏమీ అక్కర లేకుండా, జగమంత కుటుంబం నాది అని చెబుతూ ఏకాకిగా ఉంటాను అని అంటాడు. మరి RGVని స్వామీజీ అని కాక మరి ఏమని పిలవాలి?

ఇంతకీ RGV కి ఈ స్వామీజీ శక్తి ఎలా అబ్బింది? ఓ సాధారణ వ్యక్తికి, RGVకి తేడా RGVకి తనకు ఏమిటి కావాలో తనకు తెలుసు. దీనిని గోల్ గా పొరబాటు పడకండి. సాదారణ వ్యక్తికి తనకు ఏమిటి కావాలో తనకు తెలియదు. ఇది చదువుతున్నప్పుడే మీ ఆలోచనలు పలువిధాల పరిభ్రమిస్తాయి! మేధమేటిక్స్ లో ఓ సామెత ఉంది If you know what is to be done, half the problem is solved. సాధారణ వ్యక్తి తనకు ఎగ్జాట్‌గా ఏమికావాలో తెలుసుకోలేక సమస్యల సుడిలో కొట్టుకుంటూ, కనీసం

అందులోంచి బయట పడాలని కూడా కోరుకోడు. అందుకే RGV అందరిని గొర్రెలని ధైర్యంగా అనగలుగుతాడు. ఒక వేళ మనమే అతని స్థానంలో ఉంటే సందర్భం లేకుండా modesty చూపెడుతూ (చూపెడుతున్నా మనుకుంటూ) మంచి మార్కులు కొట్టేయడానికి ప్రయత్నిస్తాం. ఇంతకీ RGV కి కావలసింది ఏమిటి? శృంగార పురుషుడిగా పలు స్త్రీలతో మన్మథలీలలు కావిస్తూ, వారి సాంగత్యంలో కాలాన్ని మరచిపోవడం. ప్రతి సెకనూ నిత్యనూతనంగా గడపడం.

హ్యాపీగా ఉండండి, ఎంజాయ్ చెయ్యండి అని అంటుంటాం. దాని అర్థం మనకు నిజంగా తెలియదు. ఈ క్షణాన ఒక్కసారి ఆలోచించి చెప్పండి, హ్యాపీ, ఎంజాయ్ అంటే అర్థం ఏమిటి? ఏ రకమైన గోల్సు లేకుండా కాలాన్ని మరచిపోవడమే ఎంజాయ్ చెయ్యడం అని అయాన్ రాండ్ RGV కి చెప్పింది. ఎంజాయ్ అనేది వర్తమానంలో మాత్రమే ఉంటుందని చెప్పింది. అంతేకాదు. హ్యాపీ అనేది వర్తమాన, భవిష్యత్తులలో ఉండదని కూడా చెప్పింది. ఈథర్ (ether)వంటి ఈ గోల్‌ను సాధించాలంటే ఏం చెయ్యాలి? RGVకి నిషే చెప్పే వుంటాడు. మెదడులో ఓ ప్రపంచాన్ని సృష్టించుకోమని! మరి రాసలీలలకి స్త్రీల కంపెనీ అనేది భౌతికమైన లక్ష్యం. ఇది సాధించాలంటే మంచి పాపులారిటీ ఉండాలి మంచి పాపులారిటీకి స్త్రీల కంపెనీ చుక్కెదురు. పైగా చెడ్డపాపులారిటీయే తన ఇష్టరాజ్యానికి అనువైన మార్గం. అందువలన తాను ఏదోవిధంగా నలుగురి నోళ్ళలో నానాలి. ఇదీ RGV యొక్క ఈథర్ గోల్. తన మీదకు విసురుతున్న రాళ్ళతో ఇల్లు కట్టుకోగల తెలివైనవాడు RGV అందుకే అతని నెగిటివ్ పాపులారిటీని అడ్వర్టైజ్‌మెంట్ ఖర్చు లేకుండా

తన సినిమాలకు కేన్ వాస్‌గా వాడతాడు. టీవీ వాళ్ళు కూడా ఎంచక్కా RGV గురించి  చర్చిస్తూ తమ టైం అమ్ముకోవచ్చు!

ప్రతి పురుషుడు 12 నుండి 20 సంవత్సరాల మధ్య ఎక్కువగా సెక్స్ గురించి ఆలోచిస్తూ ఉంటాడు. తరువాత అది తగ్గుతూ వొస్తు 40 దాటేక చచ్చుబడిపోతుంది. అందుకే 35దాటిన పురుషులు కెరీర్ మీద, గోల్స్ మీద, ఉద్యోగం మీద శ్రద్ధ కేంద్రీకరిస్తున్నట్లు ప్రవర్తిస్తుంటారు. 12 నుండి 20 మధ్యన అంత ఉదృతంగా ఉన్న తృష్ణని ఎలా జీవితాంతం నిలకడగా నిలబెట్టుకోవాలి అని RGV ఆలోచించేడు. ఆ ప్రక్రియలో చాలా పుస్తకాలు చదివేడు. ప్లస్ ఖచ్చితంగా మధన పడే ఉంటాడు. అప్పుడే జ్ఞానోదయం అయ్యి ఉంటుంది. తాననుకున్నవి నెరవేర్చుకోవాలంటే రెండు వస్తువులు తన జీవితంలోంచి పూర్తిగా తొలగించాలని! అవే డబ్బు మరియు తిండి. అందుకే RGV ఒక స్వామీజీ! లోకంలో ఇటువంటి ఆలోచనలు అంది పుచ్చుకున్న నామధేయములు ఉంటారా మరి? మెటీరియల్ వరల్డ్‌లో ఇటువంటి ఆలోచనలు అంది పుచ్చుకున్న ఏకైక వ్యక్తి RGV

మనం RGV లాగ అమ్మాయిలతో ఎంజాయ్ చెయ్యాలనుకుంటే వెంటనే మైండ్‌లో డబ్బు ఉండాలి కదా అన్న ఆలోచన వొస్తుంది. దీని బట్టే మనం RGV కాలేం అని తెలుస్తుంది. రేప్పొద్దున్న మనకి అప్పనంగా అమ్మాయిలు దొరికినా ఎంటర్‌టైన్ చెయ్యలేం. ఎంజాయ్ చెయ్యలేం. బహుశా RGV వారితోనే డబ్బు పెట్టిస్తాడేమో?

RGV ఈ స్వామీజీ స్థితికి ఎలా చేరి ఉంటాడు? తన జీవితం

నిత్యనూతనంగా తాను అనుకున్నట్లు ఉండాలంటే కావలసినవి స్త్రీ సాంగత్యం. RGV తాను మధనపడే కాలంలో – మధన పడడం అంటే దేవదాసు లాగ పిచ్చెక్కి తిరగడం కాదు. తన పనులు తాను చేసుకుంటూ, చదువుకుంటూ, ఒక ప్రక్క ఆలోచిస్తూ ఉండడం. RGV చాలా పుస్తకాలు చదివేవాడు. చాలా మందిని దగ్గర నుండి గమనించాడు. శంకరాచార్యుడిలా వాదించేవాడు. RGV కాలంలో (అంతర్జాలం లేదు) ఒక వ్యక్తి నిజాయితీగా నాస్తికుడుగా మారాలంటే కనీసం ఐదారు సంవత్సరాలు పడుతుంది. ఎన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవాలి? అసామాన్యం గా ఉన్న ఈ ప్రపంచాన్ని అర్ధం ఎలా చేసుకోవాలి? అందు వలనే RGV ఏ విషయం మీదైనా అనర్గళంగా తనదైన శైలిలో లాజిక్‌తో మాట్లాడి, విషయం చెడకుండా, కుండ బద్దలు కొట్టినట్లు సమాధానం చెప్పగలగుతున్నాడు.

రామూఇజం చూడండి – ఒక ఫిలాసఫర్ మాత్రమే అలా మాట్లాడ గలుగుతాడు. మత ప్రవక్త అలా మాట్లాడలేడు. తేలిపోతాడు. RGV ని స్వామీజీ అని అనడం నిజానికి పూర్తిగా తప్పు. వేదాంతి అని అనడం సబబు. కానీ RGV మతం లోకానికి వ్యతిరేకంగా కనబడుతుంది. కాబట్టి మత ప్రవక్తుడిగా భావించి స్వామీజీ అని అన్నాను.

ఆఖరుగా RGV దేవుడి గురించి చాలా చక్కగా నిర్వచించాడు. RGV బాషలో దేవుడు వేరు, సృష్టికర్తవేరు. సృష్టికర్త సృష్టిని సృష్టిస్తూ, తన పనిలో తాను బిజీగా ఉంటాడు. అతనిని పూజించవలసిన అవసరం లేదు. పూజించమని అడగడు కూడా! దేవుడు అంటే సాదారణ మానవుడి స్తోత్రించి,

పూజించేవాడు. అటువంటి దేవుడు కంటే మనిషి ముందు పుట్టేడు అని అంటాడు RGV. మనిషి ముందా? దేవుడు ముందా? అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి అని ప్రతి సందర్భంలో వక్కాణిస్తాడు. తమ అభద్రతా భావనను అణచుకోవడానికే ఇటువంటి వాళ్ళు దేవుళ్ళను పూజిస్తారని RGV నిస్సందేహంగా పలికేడు. సృష్టికర్తను పూజిస్తున్నామని నమ్మబలికి, దేవుడిని ఆరాధించే మామూలు జనాన్ని చూసి, RGV నవ్వుకుంటాడు. RGVని సృష్టికర్త గురించి చెప్పమంటే ఒక సూక్ష్మమైన ఉదాహరణతో చాలా అద్భుతంగా వివరించాడు.

“ఒక పుట్టలోని చీమలు భారత దేశానికి నరేంద్ర మోడీ సరి అయిన ప్రధని అవునా కాదా అని డిస్కస్ చేసుకుంటున్నాయి”

RGV ఇక్కడ సాధారణ మనుష్యులను చీమలతోను, మోడీని సృష్టికర్తతోను పోల్చేడు. ఇక్కడ చీమల్లాగ సృష్టికర్త గురించి మానవుడు ఆలోచించవలసిన అవసరం లేదని RGV ఉద్దేశ్యం. ఈ చిన్న ఉదాహరణ చాలు RGV మేధో సంపత్తి అంచనా వేయడానికి, Clarity of mind ని చూడడానికి.

కానీ సృష్టికర్త విషయంలో RGV ఒక లాజిక్ మిస్సయ్యాడు. దాని వలన ఫిలాసఫర్ నుండి స్వామీజీ స్థాయికి పడిపోయేడు. పాయింట్ ఏమిటంటే సృష్టికర్త కూడా లేడు. ఎలాగంటారా? మనం ఏం మాట్లాడినా కాలం ప్రామాణికంగా తీసుకుంటాం (మనకు తెలియకుండానే). సృష్టి ఎలా మొదలయ్యింది అని ఆలోచిస్తున్నామంటే మనం కాలంలో వెనక్కి

ప్రయాణిస్తున్నామన్న మాట. అంటే టైమ్ మెషీన్‌లో గతంలోకి ప్రయాణిస్తున్నామన్న మాట. అలా కాలంలో వెనక్కి వెళ్ళగా, వెళ్ళగా, మనకి సృష్టికర్త, సృష్టి ఆవిర్భావం రెండూ కనిపిస్తాయి. అప్పుడు మనం అర్థం చేసుకోవలసిన నిజం ఈ సృష్టితో పాటు, సమాంతరంగా కాలం కూడా సృష్టించబడిందని! అంటే సృష్టి మొదలయ్యింది అని అన్నామంటే కాలం కూడా మొదలయ్యింది అని అన్నట్లే! కాబట్టి సృష్టికి ముందు కాలం లేనట్లే – అంటే సృష్టి కర్త కూడా లేనట్లే! సూక్ష్మంగా చెప్పలంటే, ఈ రోజు సృష్టి మొదలయ్యింది అని అనుకుంటే, ఈ రోజే కాలం మొదలయ్యిందని అర్థం. మరి నిన్న? నిన్న కాలం లేదు. అంటే సృష్టి లేదు. సో సృష్టికర్తలేడు.

సరదాగా చెప్పాలంటే దేవుడు కూడా మోయలేని రాయిని దేవుడు సృష్టించగలడా?

– : o : –

## 2. మనీ - ఫుడ్

ముందుగా ఫుడ్ గురించి మాట్లాడుకుందాం. రామూఇజంలో ఈ ఫుడ్ ఎసిపోడ్‌ని నెంబర్‌వన్‌గా తీసుకోవచ్చు. నా వ్యక్తిగత అభిప్రాయం, ఇదే గ్రేటెస్ట్ ఎపిసోడ్. ఇన్ని వెధవ పనులు ఆ జానెడు పొట్ట కోసమే కదా అని అంటూ ఉంటాం. అటువంటి జానెడు పొట్టని చాలా పిన్న వయస్సులోనే జయించిన వ్యక్తి RGV. టేస్ట్‌కి ప్రాముఖ్యత ఇవ్వకూడదు, జంతువుల్లా ఆకలి వేసినప్పుడు సరిపడంత తిండి తింటె చాలు అని గ్రహించిన వ్యక్తి. ఈ మాత్రం ఆయుర్వేద జ్ఞానం మనందరికి ఉంది. కాని అవలంబించడానికి మాత్రం సాహసించం. ఫుడ్ గురించి RGV చాలా చక్కగా వివరించాడు. సింహం ఆకలి వేసినపుడు మేక కంటె గొర్రె రుచిగా ఉంటుందని వేటాడదు. తనకి ఎదురుగా కనపడిన జింకని తిని ఆకలి తీర్చుకుంటుంది. అంతే కాని కండలు పట్టిన జింక కోసం వెతకదు. ఈ రకంగా మానవులు టేస్ట్ కోసం కాకుండా, ఆకలి తగ్గట్టుగా జీవించాలి అన్నది RGV సిద్ధాంతం. నిజానికి ఇది నూటికి నూరుపాళ్లు కరెక్ట్. మనందరం టేస్ట్ కోసం దేవురించడం వలన ప్రతి ఊరులోని రోడ్లన్ని రెస్టారెంట్లతో, ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లతో నిండిపోయాయి. మన స్త్రీలకు ఏ పని చేతకాక ఫుడ్ వండడం మీద పడ్డారు. దానివలన అదో పెద్ద ఇండస్ట్రీ అయి కూర్చుంది. ఎపిక్యూరియన్ ఫిలాసఫీని Eat to Live, Live not to eat అని మనసా వాచా పాటిస్తున్న వ్యక్తి RGV. మహానుభావుడు ఇంతటి పరిణితి ఎలా అలవర్చుకున్నాడో? అంతేకాక మానవాళికి ఉన్న అత్యంత బ్యాడ్ హేబిట్ టేస్టీ ఫుడ్ తినడం. ఎప్పుడైతే టేస్టీ ఫుడ్ తినడం మొదలు పెట్టేమో, అది అతి అవుతుంది. అతి శరీరానికి

ఆటోమెటిక్‌గా హాని చేస్తుంది. సిగరెట్, విస్కీలాంటి చెడ్డ వస్తువులు ఆస్వాదించడంవలన కొంతైనా జాగ్రత్త పడతాం. అదే మంచి ఫుడ్ విషయంలో నియంత్రణ కోల్పోతాం.

"Tasty food is injurious to health", "రుచికరమైన ఫుడ్ ఆరోగ్యానికి హానికరం" అని చెప్పిన ఏకైక వ్యక్తి RGV. ఫుడ్‌ని మితంగా కూడా కాదు – ఇదమిద్ధంగా తినండి. ఇదీ RGV ఫిలాసఫీ.

ఇంతకీ RGV కి ఈ ఫుడ్ పరిణితి ఎలా వొచ్చిందంటారు? ఈ వివరణ RGV కే తెలియక పోవచ్చు ! స్టూడెంట్‌గా ఉన్నప్పుడు, RGVకి పంపించిన డబ్బులు మొదటి రోజునే ఖర్చు చేసేసేవాడు. మళ్ళీ ఇంటి నుండి డబ్బు తెప్పించుకునేవాడు కాదు. మరి ఎలా? తన ఐడియాలు, తన లాజిక్, తన తెలివితేటలు, తన విషయ పరిజ్ఞానం ఫ్రెండ్స్ ముందు ప్రదర్శించి, వారికి ఆదర్శవంతమైన చోటా నాయకుడు అయ్యాడు. ఇప్పటికి చూడండి, RGVతో పని చేసిన ఏ టెక్నిషియన్ లేదా నటుడు – RGVని పల్లెత్తు మాట అనడు. పైగా అడ్మిరేషన్‌తో మాట్లాడుతాడు. ఒక మీడియా వాళ్ళు మాత్రం తమ టైం అమ్ముకోవడానికి RGVని దుమ్మెత్తి పోస్తారు. ఏ నాయకుడికైతే అడ్మిరేషన్ ఉందో అతనిని బిల్లు కట్టనివ్వరు. ఈ రకంగా RGV స్టూడెంట్‌గా నెగ్గుకు వొచ్చాడు. RGV రక్తంలో ఒక ముఖ్యమైన క్వాలిటీ ఉంది. అది ఆరు నూరైనా అవతలి వాళ్లమీద ఆధారపడక పోవడం! నేను ఏ రోజైతే వేరే వాళ్ల మీద ఆధారపడతానో ఆరోజే ఆత్మహత్య చేసుకుంటానని RGV చాలా సార్లు అన్నాడు. స్టూడెంట్ లెవల్‌లో స్వతంత్రుడిగా బ్రతకడానికి రెండు

వస్తువులు కావాలి. మొదటిది తిండి మీద వ్యామోహం తగ్గించడం. రెండవది వారి చేత బిల్లు పెట్టించకుండా ఉండడం. ఇక్కడ జాగ్రత్తగా గమనించండి మొదటిది అంటె తిండి మీద వ్యామోహం తగ్గించడం అంటే మాటలు కాదు. మనకి frustration, depression ఏది వచ్చినా ఎక్కువ తినేస్తాం, ఎక్కువ తాగేస్తాం.

ఓ 20 ఏళ్ల కుర్రాడు తిండి మీద వ్యామోహం తగ్గించాలంటే ఎంత ఆలోచించాలి. ఎంత పరిణితి తెచ్చుకోవాలి. పరిణితి మనకి కూడా ఉంది! కాని సమయం వచ్చినప్పుడు పరిణితిని ప్రక్కన పెట్టి 'ఈ రోజుకి' అని అపరిమితంగా తింటాం. చాలెంజ్ ! 20 ఏళ్లకే RGV పరిణితితో పాటు, frustration, depression, anger మొదలగు నెగిటివ్ ఎమోషన్స్‌ని పారద్రోలేడు. జాగ్రత్తగా గమనించండి, నెగిటివ్ ఎమోషన్స్ ఆకలిని ప్రేరేపిస్తాయి. మీరు గర్ల్‌ఫ్రెండ్‌తో అత్యంత సంతోషంగా ఉన్నప్పుడు ఆకలి ఎందుకు గుర్తు రాదు? తనకు కావలసింది, సంతోష పరిచేది ఏమిటో RGV తెలుసుకోవడం వలన ఆకలిని ప్రకోపించే నెగిటివ్ ఎమోషన్స్‌ని దరిచేరనివ్వలేదు. ఈ రకంగా తిండి మీద వ్యామోహాన్ని RGV జయించాడు. అంటే ఓ చిన్న సమోసతో తన ఆకలిని తీర్చుకోగల స్థాయికి ఎదిగేడు. అటువంటప్పుడు బిల్లు వేరే వారు ఇచ్చే ప్రసక్తే లేదు. ఈ రకంగా RGV తన ఫ్రెండ్స్‌కి తిండి రూపంలో బరువు కాలేదు. నేను ఊహించి, నా అనాలిసిస్‌తో ఇది రాస్తున్నా, ఆకలిని జయించడం దాదాపుగా అసాధ్యం. ఇక్కడో చిన్న లాజిక్. డబ్బులు లేకపోవడం అనే పరిస్థితి కూడా RGVని ఆకలిని జయించడానికి తోడ్పడ్డాయి. కాని మనం అయితే? తరువాత కాలంలో డబ్బు సంపాదించడం మొదలుపెట్టగానే

కడుపెక్క తినెస్తాం. RGV గ్రేట్! అంతే కాదు టేస్టీ ఫుడ్, మసాలా ఫుడ్ తింటున్నప్పుడు, కడుపు నిండింది అన్న సిగ్నల్ మైండ్‌కి అందదు. సిగ్నల్ కట్ అయిపోతుంది. అందుకే కావలసిన దానికంటే ఎక్కువ తినేస్తాం.

**మనీ**

RGV డబ్బు గురించి తన అభిప్రాయం చాలా సూక్ష్మంగా చెప్పేడు. డబ్బు అనేది కరెన్సీ నోటు కాదని, ఐడియాల ద్వారా డబ్బు ఉత్పత్తి అవుతుందని, డబ్బుని స్థితి శక్తిగా ఉంచకూడదని, దానిని ఎప్పుడూ గతి శక్తిగానే చూడాలని – ఎలా గతి శక్తిగా మార్చగల మని ఆలోచించాలి అని అద్భుతమైన నిర్వచనం ఇచ్చాడు. నాకు అర్థం కానిది అతి చిన్న వయస్సులో ఇంతటి పరిజ్ఞానాన్ని ఎలా సంపాదించాడా అని?

మనం జాగ్రత్తగా గమనిస్తే ఒకటి అర్థం అవుతుంది మనందరం ఉద్యోగాలు, వ్యాపారాలు డబ్బుకోసం చేస్తూ ఉంటాం. డబ్బు ద్వారా బ్రతుకీడ్చవచ్చునది మన అభిప్రాయం. కాని మనం లోతుగా గమనిస్తే పేదరికం అంటే భయం కొద్దీ, డబ్బు సంపాదనలో ఉంటాం. రేపు అనేది మన చేతుల్లో లేదనేది మన వెధవ నమ్మకం. మన పేదరిక భయాన్ని రేపు అనే అపనమ్మకం మీద తోసేసి, డబ్బు కోసం పరిగెడతాం.

RGV ఆస్తులు విలువ 50–60 కోట్లు ఉంటాయి (youtube న్యూస్ ద్వారా). అయినప్పటికి ఐశ్వర్యం ప్రదర్శించడమన్నది హీనమైన చర్య అని, అది అవతలి వ్యక్తిని తక్కువ చేసినట్లవుతుందని ఆత్మ సాక్షిగా నమ్ముతాడు. గత 30 సంవత్సరాలుగా RGV కరెన్సీ నోటుని ముట్టుకో లేదంటే అతిశయోక్తి

కాదు. క్రెడిట్ కార్డులు, డెబిట్ కార్డులు తన జేబులో ఉంచుకోకుండా ఈ ఆధునిక కాలంలో జీవితాన్ని నెగ్గుకొస్తున్నాడంటే, డబ్బు స్థాయి ఏమిటో దాన్ని ఎక్కడ ఉంచాలో బాగా తెలిసిన వ్యక్తి RGV. RGV ఎలాగ డబ్బుకు దూరంగా ఉంటూ, డబ్బే వలయంగా చేసుకున్న సినిమా ప్రపంచంలో ఉండ గలుగుతున్నాడో మన ఊహకి కూడా అందదు. జేబులో డబ్బులు లేకుండా మనం ఒక్క క్షణం గడప గలమా?

RGV స్టూడెంట్‌గా ఉన్నప్పుడు మొదటి రోజునే డబ్బంతా ఖర్చుచేసేవాడు. మరి డబ్బు ఉత్పత్తి చెయ్యాలంటే ఏమి చేయ్యాలి? మనమైతే ఈ దరిద్రమైన పేదరికం నుండి దూరంగా పారిపోవాలని ఆలోచిస్తాం. కాని RGV ప్రకృతిలో డబ్బు ఒక భాగం కాదు. మనిషి తన కన్వీనియన్స్ కోసం ఈ డబ్బుని సృష్టించేడు. అంటే నేచర్‌లో లేని దాని గురించి మనం ప్రాకులాడుతున్నామన్న మాట. ఇది అసహజం. జంతవులకి డబ్బుతో ప్రమేయం లేదు. మిగిలిన జీవులతో పాటు, మనిషి కూడా ఒక జీవి. అటువంటప్పుడు మనిషనే జీవికి డబ్బు తన జీవితంలో భాగం కాకుడదని RGV గ్రహించాడు. అదే మనం అయితే 'ఆ రోజుల్లో డబ్బులు లేక చాలా ఇబ్బందులు, కష్టాలు పడ్డాం' అని అంటాం. అంటే మనం ఏమిటి చెబుతున్నాం? భవిష్యత్తులో డబ్బు కష్టాలు రావడానికి వీల్లేదు అని! అందువల్లే మనం డబ్బు కోసం పరిగెట్టి, డబ్బుకి స్థితి శక్తి (potential energy) కల్పిస్తాం. జాగాలు, ఇల్లులు, కార్లు కొనేస్తాం. చూశావా నేను ఎంత సంపాదించేనో అని ముచ్చట పడిపోతాం. ఐశ్వర్య ప్రదర్శనకి పూనుకుంటాం. మనకి తలుపుకి గడియపెట్టకపోతే రాత్రి నిద్ర పట్టదు. మన ఇంగితం ఒక్క రోజుకి ఏమీ

జరగదు అని చెబుతున్నా, 'అమ్మో' అని మనం నిద్రపోలేం. అదే విధంగా 'అమ్మో రేపు' అని భవిష్యత్తు కోసం అభద్రతా భావనికి లోనయ్యి మనం స్థిరాస్తులు కూడబెడతాం. అభద్రతా భావనను తొలగించు కోకుండా దాన్ని డబ్బుతో సమాధాన పరుస్తాం. దానివలన అభద్రత మరింత పెరుగుతుంది మరింత ఆస్తులు సంపాదిస్తూ పోతూ ఉంటాం. మనకి, RGVకి ఉన్న ప్రాధమిక తేడా స్థితి డబ్బు, గతి డబ్బు.

ఒక వేళ RGVకి మనలాగ డబ్బు సంపాదించాలన్న ఆలోచన వొచ్చిందనుకోండి. ఒక 500 కోట్లు సంపాదించగలుగుతాడు. 70–80 సినిమాలు తియ్యలేడు. అంతమంది నిర్మాతలు దొరకరు. ప్రతి సినిమాని భయం, భయంగా తీస్తాడు. హిట్, ఫ్లాపుల లెక్కల్లో పడతాడు. వీటన్నిటి కంటే ముఖ్యమైనది రాముఇజం ఉండదు. RGV నుండి మనం నేర్చుకో వలసింది ఉండదు. అంతే కాదు అతని వోడ్కా కూడా అతని ఆరోగ్యం పాడు చేస్తుంది.

భగవత్ గీతని మనం నమ్ముతాం, RGV ఆచరిస్తాడు. అతని లాజిక్ ఒక్కటే. ఫలితం మీద మనకు అధికారం లేదు. RGVకి కావలసింది విషయాన్ని అస్వాదించడం, ఎలాగైనా పాపులారిటీ పెంచుకోవడం. ఈ రెండు విషయాల్లో డబ్బు లేదు. అందుకే తన సినిమాలని ఇష్టమైతే చూడండి అని ధైర్యంగా చెబుతాడు. డబ్బుకి విలువ ఇవ్వడు కాబట్టే, చూస్తే చూడండి, లేకపోతే లేదు అని అంటాడు. నిజానికి ఇలా చెప్పడం వలన ప్రేక్షకుడికి హుందా తనం కల్పించి, తగిన స్వేచ్ఛ ఇస్తున్నాడు. లేకపోతే బాబూ మా సినిమా

చూడండి. అంత బావుంటుంది, ఇంత బావుంటుంది అని లేని పోనివి చెబుతూ, మీరు సినిమా చూడకపోతే మా నిర్మాత అడుక్కు తిని పోతాడు అని ఆడియో ఫంక్షన్స్‌లో బిక్షమెత్తుకోవాలి. ఇంతకీ అలా బిక్ష మెత్తుకున్నా, ఆడిన సినిమాలు దాదాపుగా వేళ్లమీద లెక్కపెట్టవొచ్చు.

కాబట్టి RGV డబ్బు మీద దృష్టి సారించి ఉంటే అతనికి ఇంత పాపులారిటి వొచ్చేది కాదు. RGV పాపులారిటి మీద, దృష్టి సారించడం వలన ఇంత ఎత్తుకు ఎదిగేడు. ఎంతోమంది పాపులర్ డైరక్షర్లు అతని దగ్గరే అక్షరాభ్యాసం చేసేరు. అలాగని RGV డబ్బుకి విలువ ఇవ్వకపోడు. సినిమాని బ్రతికిస్తే, డబ్బు బ్రతుకుతుందని RGV కి తెలుసు ఈ కాలంలో రెండు లక్షలకి ఐస్క్రీం తీసేడు. నిజంగా ఇది ఒక అద్భుతం. ఇలా చాలా ప్రయోగాలు చేసేడు. ఇంట్లో వాడే కెమెరాతో దొంగలముఠా తీసేడు. ఐఫోన్‌తో సినిమా తియ్యండి అని చెప్పేడు. కోపరేటివ్ బేసిస్‌లో సినిమా తియ్యండి అని ఐస్క్రీం సీరిస్ తీసేడు. ఈ ప్రయోగాలన్నీ కూడా సినిమాని బ్రతికించడం కోసం.

ఈ ప్రయోగాలు హిట్ అవ్వకపోవడానికి కారణం ఏమిటంటే, మనందరికి డబ్బు పిచ్చ. కోపరెటివ్ బేసిస్‌లో సినిమా తీస్తే, మనం చచ్చి చెడి పని చేసినా, డబ్బులు రాలవేమోనన్న అపనమ్మకం. అమ్మో రేపు ఎలాగా? దాదాపుగా సినిమా ఇండస్ట్రీలో పని చేస్తున్న వారందరికి, డబ్బు మీద ఇంట్రస్ట్ తప్ప, RGV లాగ సినిమా మీద ఇంట్రస్ట్ లేదు. సినిమా మీద ఇంట్రస్ట్ ఉన్నవాడు RGV - methods లో ఏదో ఒకటి పట్టుకొని పైకి ప్రాకుతాడు. RGV శిష్యుల్లో ఒక్కడు కూడా అత్యంత గొప్ప డైరక్టర్ అయినవాడు లేడు (బహుశ: కృష్ణవంశీ ఏమైనా అవచ్చు?)

ఎందుకంటే వారి ఆలోచన్లలో డబ్బు ముందు ఉంటుంది, సినిమా తరువాత ఉంటుంది. వారికి నిర్మాతలు కూడా దొరకడం కొంచెం కష్టం. నా ఉద్దేశం ఏమిటంటే ఆదుర్తి సుబ్బారావు శిష్యుడు కె. విశ్వనాధ్ లాగ ఒక్క RGV శిష్యుడు కనపడడేమి? ఎందుకు పైకి రావటం లేదు?

ముగింపు ఏమిటంటే, సినిమా అనే ఆర్టిస్టిక్ సముద్రంలో RGV తన విన్యాసాలతో, కొత్త ఆలోచనలతో ఈతకొడుతున్నాడు. తన ఈతకు ఒడ్డులేదని, ఒక వేళ ఏదైనా ఒడ్డు దొరికినా, వెంటనే దాన్ని వొదిలి మళ్ళీ ఈత ప్రారంభిస్తాడు. అందుకే RGV మీద కామెంట్ “నువ్వు ఎంత కొట్టినా చావని పాముని – మళ్ళీ బుస ప్రారంభిస్తావు”. పై ఆలోచనా విధానంలో ఎక్కడ డబ్బు అనే ఆలోచన ఉండదు. కాని మనం RGV శిష్యుడైతే, సినీ సముద్రంలో ఎక్కడో, అక్కడా డబ్బు అనే దీవిని పట్టుకొని ఆగిపోతాం. మళ్ళీ ఈత ప్రారంభించినా డబ్బు అనే దీవి కోసం ‘వెనక్కి’ ఈత ప్రారంభిస్తాం. మనం గమనించ వలసింది చాలా మంది సినిమా వాళ్ళు వేరే పని చేతకాక సినిమా ఫీల్డ్‌లోనే ఉండిపోయారు. వారు కూడా కళామతల్లికి సేవ చేస్తున్నాం లాంటి కబుర్లు చెబుతుంటారు. సూక్ష్మంగా చెప్పాలంటె మనకు IAS పాసయ్యి కలెక్టర్ అవ్వడం ఇష్టం. దాని కోసం గొడ్డులా కష్టపడతాం. కాని కలెక్టర్ అయ్యాక సర్వీసెస్ మీద పెద్ద ఇంట్రస్ట్ ఉండదు.

– : ০ : –

## 3. RGV **కి కావలసింది?**

RGVకి కావలసింది పాపులారిటి! మంచిగానో, చెడుగానో తన గురించి ఎక్కువ మంది మాట్లాడుకోవడం. ఎంత ఎక్కువ మంది ఆలోచన్లలో తాను ఉంటే, తనకి అంత ఇష్టం. ఒక రకంగా చెప్పాలంటే – చిన్న పిల్లావాడి మనస్థత్వం. పిల్లవాడు ఎక్కువ అల్లరి చేసేది అందరి దృష్టి తనవైపుకి తిప్పుకోవడానికే. RGV పాపులారిటి కోసం సినిమాని వాహనంగా వాడుకుంటున్నాడు. RGVకి నాలుగైదు దార్లు ఉన్నాయి. అందులో సినిమా దారి తనకి సుగమం అని RGV ఎత్తుకున్నాడు. RGV కి క్రికెట్ అంటే ఇష్టం లేదు. ఒక వేళ తన పాపులారిటీ కోసం క్రికెట్‌ని ఎంచుకుంటే, అందులో కూడా ఇంత ఎత్తుకి రావడానికి అవకాశం ఉంది. ఎందుకంటే మనిషిలో నిజాయితీ ఉంది కాబట్టి.

RGV సినిమా ఫీల్డ్‌కి ఎలా రాబడ్డాడు? ఎవరైతే ఎక్కువ పుస్తకాలు చదువుతారో ఎక్కువ లాజిక్ వాడతారో, ఎక్కువ మైండ్ పవర్ వాడతారో వాళ్ళు ఆటోమెటిక్‌గా టీచర్లు అయిపోతారు. టీచర్ అంటే తనకు తెలిసింది అవతల వారికి అర్థం అయ్యేటట్లు, బాగా గుర్తు వుండేటట్లు చెప్పగలగటం. దురదృష్టవశాత్తూ RGV కి టీచింగ్ అంటే ఇష్టం లేదు. తన నాలెడ్జిని మూఢులకు చెప్పడమేమిటని ప్రశ్నిస్తాడు. బాగా నాలెడ్జ్‌ని సంపాదించిన వ్యక్తి దాన్ని ప్రదర్శించడానికి ఉబలాటపడతాడు. అంటే టీచరుగా మారతాడు. సినిమా డైరక్షన్ అంటే టీచింగ్ కాక మరేమిటి? తనకున్న ఐడియాని సుందరంగా మలిచి ప్రేక్షకుల ముందుకు తీసుకురావడమే. మనకు తెలిసిన

అత్యంత పాపురల్ టీచర్లు (డైరక్టర్లు) రాఘవేంద్రరావు, రాజమౌళి. మృణాళ్‌సేన్, శ్యామ్ బెనగల్ లాంటి టీచర్లు (డైరక్టర్లు) ఉన్నా, వారి స్టాండర్డ్ ఆఫ్ టీచింగ్ చాలా హెచ్చుస్థాయిలో ఉంటుంది. టికెట్ కొనుక్కుని వెళ్ళే ప్రేక్షకుడు సినిమా ట్యూషన్ మాష్టర్ టీచింగ్ స్తాయిలో ఉండాలని కోరుకుంటాడు. ఇంతకీ అసలు విషయానికి వస్తే, బాగా నాలెడ్జ్ ఉన్నవాళ్ళు, సాధారణంగా టీచర్లు అవుతారు. ఈ రకంగా RGVకి టీచింగ్ అంటే ఇష్టం లేకపోయినా డైరక్టర్ కాక తప్పలేదు. RGV టీచర్ కాకపోతే మరి రామూఇజం ఏమిటో? రామూఇజంలో ఉన్నవి టీచింగ్స్ కాక మరేమిటి? నేను ఈ పుస్తకం రాయడానికి రామూఇజం టీచింగ్స్ యే కారణం. RGV చెప్పదల్చుకున్నదేమిటి? అతని అంతర మనస్సులో ఏమున్నది? లాంటి ప్రశ్నలతో ఈ పుస్తకం తయారైంది.

RGVకి కావలసింది సినిమా ఎరినా లో పాపులారిటీ. Winners do things differently అన్నట్లు, సినిమాలు చూసి, చూసి తన స్టయిల్ ఒకటి RGV క్రియేట్ చేసుకున్నాడు. అంత నాలెడ్జ్ ఉన్నవాడికి ఆటోమేటిక్‌గా వద్దన్నా ఒక స్టయిల్ తయారవుతుంది. తన సినిమాల్లో క్లోజప్ షాట్స్, హ్యూమన్ ఫీలింగ్స్, కొంచెం విపరీత పోకడలు చూపెడతాడు. RGV స్టయిల్ ఎంత గొప్పది అంటే మొత్తం తెలుగు సినిమా చరిత్ర అంతా ఒక పుస్తకంగా ప్రచురిస్తే, ఆ పుస్తకం ఆట్టమీద రాజమౌళి బొమ్మ, లోపల శివకి ముందు శివకి తరువాత అని ఒక చాప్టరు ఉంటుంది.

సినిమాల్లోకి ఏతెంచిన ఈ ఘనాపాటి పాపులారిటీ కోసం (పాపులారిటీ అంటే అందరి దృష్టి తనమీద ఉండాలి లేదా అందరూ తన గురించి

ఆలోచించాలి, ఇలా...) చాలా వెరైటీ సినిమాలు తీసేడు. డైరక్టర్‌గా అన్ని ఏరియాలు టచ్ చేసినవాడు ఇంకొకడు లేడంటే అతిశయోక్తి కాదు. తన మార్కెట్ సైజ్ తగ్గిపోతోందని తెలిసి హిందీ ఫీల్డ్‌కి షిఫ్ట్ అయ్యి, అక్కడ కూడా ఒక వెలుగు వెలిగేడు. మనిషికి స్టఫ్ లేకపోతే పెద్ద పెద్ద నటులను తన సినిమా కోసం ఒప్పించ గలగడం సాధ్యమా? ఈ రకంగా పెద్ద నటులతో సినిమాలు తియ్యడం వలన తన పాపులారిటీ మరింత పెరుగుతుంది.

ఇంతకీ RGV కి ఈ పాపులారిటీ పిచ్చ ఎలా వొచ్చిందంటారు? ఈ విషయం ప్రక్కన పెడితే, ప్రతి వ్యక్తి కౌమార దశలో తల్లిదండ్రులను, సొసైటీని ఎదిరిస్తాడు. జుట్టు పెంచుకుంటాడు. ఈ సంఘ నియమాలు పాటించక్కరలేదంటాడు. దేవుడిని ఎందుకు నమ్మాలి లాంటి ప్రశ్నలు ఆవేశంగా సంధిస్తాడు. ఈ స్థితిని I am ok you are not ok గా భావించవచ్చు. వయస్సు పెరుగుతున్నప్పుడు, పాల పొంగు లాంటి ఈ ఆవేశం మెల్లిగా తగ్గి తాము సంధించిన ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోకుండా, సంఘంలో కలిసిపోయి, గుంపులో గోవిందయ్యగా మారతాడు. హార్మోన్ల మార్పు వలన వచ్చిన పై ఆవేశంతో తమని తాము నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తారు. సాధారణంగా ఈ ఆవేశం 5 నుండి 10 సంవత్సరాలు ఉంటుంది. కొందరికి 50 ఏళ్ళ వరకు కూడా ఈ ఆవేశం ఉండవచ్చు. కొంత మంది యువతగా ఉన్నప్పుడు కమ్యూనిష్టులుగా ఉండి తరువాత ఆ ఆలోచనను పూర్తిగా విడనాడి, కేప్టలిస్టులుగా మారతారు. వారిని చూసి మనం ముక్కున వేలేసుకుంటూ ఉంటాం. చలం లాంటి ప్రముఖ రచయిత చివర వరకు ఆవేశంగా ఉండి తన రచనల ద్వారా సంఘాన్ని ప్రశ్నించి చివరకు ఆస్థిక బాట పట్టి,

ఆరుణాచలంలో పరమ పదించాడు. చెప్పొచ్చేదేమిటంటే, ఆవేశంతో తమ ప్రాముఖ్యత, సంఘంలో తమకొక గుర్తింపు కోసం పాటుపడతారు. పిల్లల్లో ఇటువంటి ఆవేశమే ఒకరిని డ్యాన్సర్‌గా, ఒకరిని రైటర్‌గా, ఒకరిని ఆర్టిస్టుగా ఇలా రకరకాలైన వ్యక్తులుగా మలుస్తుంది. లేకపోతే ఒకే క్లాసులో చదువుతున్న విద్యార్థులు విభిన్న మార్గాలలో వారి ప్రజ్ఞాపాటవాలు ఎలా చూపించ గలుగుతున్నారు?

RGV విషయానికి వస్తే, అతను మొదటి నుండి హైపర్ ఏక్టివ్. అంటే ఆవేశంగా అల్లరి చేస్తాడని కాదు. ప్రతిదానిని ప్రశ్నిస్తాడని, తన ఎమోషన్‌తో విషయాన్ని ప్రశ్నించడం వలన తన్నులు లేదా ఎదురుదెబ్బలు తినేవాడు. దీనినే లాజిక్ మిస్సయిన చోట వయలెన్స్ మొదలవుతుందని అంటాడు RGV. పాపం ఎన్ని ఎదురు దెబ్బలు తిని ఉంటాడో? చాల్లే చెప్పొచ్చావ్, ఏడిశావ్ లాంటి పదాలు కూడా మనిషిని రాటుదేలుస్తాయి. రాటుదేలిన మనిషి తన ప్రశ్నలు గాలికి వదిలేస్తే, సాధారణ గొర్రె (RGV బాషలో) అవ్వచ్చు. ప్రశ్నించడం వొదలకపోతే  గాంధీ లేదా హిట్లర్ అవ్వచ్చు. తన ఆవేశాన్ని ఏ స్థాయికి తీసుకొని వెళ్తాడో, ఆ స్థాయిలో పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తాడు. కాబట్టి ప్రతి మనిషికి సహజాతువు అయిన గుర్తింపు కోసం RGV తన స్కిల్స్‌ని వాడుకున్నాడు. RGV కి గురువు RGV లాంటి వాడు దొరికేవుంటే, మనం 1990లోనే రాజమౌళిని చూసి ఉండే వాళ్ళం.

– : o : –

## 4. తనటొఫోబియా (Thanatophobia)

తనటొఫోబియా అంటే చావు అంటే భయం. ఇది చదివి RGV కి తనటొఫోబియా ఉందని, ప్రతిరోజు రాత్రి చావు గురించి ఆలోచిస్తాడని లేదా బయపడతాడని దయచేసి ఇలా ఆలోచించ వొద్దు. నా బాధ ఏమిటంటే RGV నిరంతరం సంఘ వ్యతిరేక గుణాలు, సంఘ వ్యతిరేక సమాధానాలు చెప్తూ మనకి ఏవగింపు కలిగిస్తాడు. దాని వలన మనం నిత్యం RGV కి ఏదో ఒక రోగం రావాలని ప్రార్థిస్తుంటాం. నాలాంటి వాడు తనటొఫోబియా అనగానే దాన్ని RGV కి అట్రిబ్యుట్ చేసి ఆనందించకూడదు. ఎవరైతే జీవితాన్ని ఎక్కువ ప్రేమిస్తారో వాళ్ళకి చావు, దానికి సంబందించిన విషయాలంటే బాగా యావగింపుగా ఉంటాయి. నేను రేపు చచ్చిపోతానని తెలిస్తే, ఏ అడవుల్లోకైనా పారిపోయి, ఎవరికి కనబడకుండా చస్తాను అని RGV అంటాడు. చంటి పిల్ల పాలకోసం ఆత్రుతగా బ్రెస్ట్‌ని సక్ చేసినట్లు తాను జీవితాన్ని అంతలా ఆస్వాదిస్తున్నాను అని అంటాడు. RGV మీరు నిజంగా అంతలా ఆశ్వాదిస్తున్నారా అంటే దానికి అవుననే సమాధానం చెబుతాడు. నిజానికి 24x7 ఓ మూడేళ్ళ పిల్లాడి లాగ, లేచిన దగ్గర నుండి excited గా జీవితాన్ని అనుభవించడం సాధ్యపడదు. ఒక వ్యక్తి తనకు సాధ్యపడుతుంది అని అంటున్నాడంటే, రోజులో ఏమి జరిగినా దాన్ని యథాతదంగా తీసుకొని, అదే ఎంజాయ్‌మెంట్ అని భావిస్తున్నాడన్నమాట. వోడ్కా, పకోడిలు, వెన్నెల్లో సేవిద్దామని arrange చేసుకుంటే, వర్షం వచ్చింది. అప్పుడు బాల్కనీలో కూర్చుని, వర్షాన్ని వోడ్కోతో ఆస్వాదిసాడన్న మాట RGV. చీకటికి వ్యతిరేకం వెలుతురు, పగలుకు వ్యతిరేకం రాత్రి. ఇలా జీవితాన్ని

సక్ చేస్తున్నాను అన్న దానికి వ్యతిరేకం చావంటే ఇష్టం లేదు. అంటే చావడానికి టైం లేదన్న మాట. దీన్నే వేరే కోణంలోంచి చూస్తే, వయస్సు ఎంతో చెప్పను, బర్త్‌డేలు జరుపుకోను, రేపు అనేది లేదు. తనని 'నాన్న' అని పిలవొద్దు (పేరు పెట్టి పిలు అని కూతురికి చెప్పాడు). అంటే నాన్నా అనే పిలుపు పెద్దరికాన్ని ఇస్తుంది. ఒకరకంగా వయస్సు పెరుగుతోందని చెబుతోంది. ఇది RGV కి ఇష్టం లేదు. వయస్సు పెరుగుతూ ఉంటే ఎక్కడికి వెళ్తాం, చావుదగ్గరకి. మనం జాగ్రత్తగా గమనిస్తే RGV సినిమాల్లో కక్షలు కార్పణ్యాలు ఉంటాయి గానీ, శవాలుఉండవు. (చాలా తక్కువగా ఉంటాయి). చావు అనే సంఘటనే RGV కి ఇష్టం ఉండదు. చావు పట్ల అంత విముఖత కలిగి ఉంటాడు.

పై వివరణ అంతటినికలిపి చాలా తక్కువ స్థాయి తనటొఫోబియా అని అన్నాను. నిజానికి తనటొఫోబియా అంటే చావు భయం. నిరంతరం చావు గురించి బయపడటం. చావు గురించి వినగానే చెవులు మూసుకోవడం. RGV కి ఇవేమి లేవు. చావు అనే వాస్తవం నుంచి దూరంగా జరిగి పోవడం, హాస్పటల్స్‌కి, చావులకి వెళ్ళి పరామర్శించడాలు చెయ్యకపోవడం, చనిపోయిన వారి గురించి కొంచెం తక్కువగా బాధపడడం, ఇవన్నీ కూడా ఒకరకమైన పలాయన వాదం లోకి వస్తాయి. అంతేకానీ తనటొఫోబియాలోకి రావు. అతను 'నాన్న' అన్న పిలుపుకి వివరణ ఇవ్వచ్చు. కాని సబ్ కాంషస్ మైండ్‌లో వయస్సు పెరుగుతోందని రన్ అవుతూ ఉంటుంది.

నిజానికి మనకి ఎక్కువ స్థాయి తనటొఫోబియా వుంటుంది.

పొయ్యేకాలం, మైల స్నానం లాంటి మాటలు వాడితే ఇళ్ళల్లో పెద్దవాళ్ళు చాలా మండిపడతారు.

దేవుడికి వ్యతిరేకం దెయ్యం, చావు = దెయ్యం, దేవుడిని నమ్మను, దెయ్యాన్ని నమ్ముతాను అని RGV అంటూ వుంటాడు. RGV నిర్వచనం ప్రకారం దెయ్యం అంటే భయం, భయపెట్టడం. పైకి అలా కనిపించినా, అంతర్ మనస్సులో చావు పట్ల వున్న విముఖత దెయ్యం సినిమాలని ప్రేరేపిస్తుంది. ఇది తక్కువ స్థాయి తనటొఫోబియా లక్షణం.

– : ೦ : –

## 5. స్వీయ ఆరాధన (Narcissism)

పూర్వం నార్సిసస్ అనే గ్రీకు రాకుమారుడు చాలా అందంగా ఉండేవాడు. అద్దాలు లేని ఆ రోజుల్లో రోజూ చెరువు దగ్గరకి వెళ్ళి తన అందాన్ని నీళ్ళల్లో చూసుకునేవాడు. తన ప్రతిబింబాన్ని తానే ప్రేమించుకొని, నీళ్ళల్లో పడి చనిపోయాడు. ఎవరైతే తమని తాను అమితంగా, ఒక మోతాదుకి మించి (ఇక్కడ మోతాదుని ఎవరు నిర్వచిస్తారు?) ఆరాధించుకుంటారో వారికి ఈ స్వీయ ఆరాధన (నార్సిసిజం) ఉన్నట్లు గా భావించుకోవాలి. ఒకప్పటి మన ప్రధాని మొరార్జీ దేశాయ్ తాను స్వయం మూత్రం తాగేవాడినని నిర్భయంగా చెప్పుకునేవాడు (మనమైతే సిగ్గుపడతాం, ఆధునిక వైద్య సైన్స్ ప్రకారం ఇది కేన్సర్ నిర్మూలకం). దేశంలో పూర్తి మధ్యపాన నిషేదం ప్రప్రధమైన సమస్యగా భావించేవాడు. ఈ రకంగా తనకున్న అభిప్రాయాలు, విలువలే అత్యంత గౌరవ ప్రదమని భావించడాన్ని స్వీయ ఆరాధనగా పేర్కొంటాము. నార్సిసిజం అంటే ఏదో నెగిటివ్ కాంప్లెక్స్ అని అనుకోకండి. మహాత్మాగాంధీ అహింసా వాద సిద్ధాంతం కూడా నార్సిసిజంలోకే వస్తుంది.

ఇంతకీ మన RGV విషయానికి వస్తే, అతనికి ఈ స్వీయ ఆరాధన చాలా ఎక్కువ. ప్రశ్నించడం, సమాధానం రాబట్టడం చేతకాని వారందరినీ గొర్రెలని సంబోధించడం. భారతదేశంలో చాలా స్ట్రాంగ్ మైండ్ ఉన్నవాళ్ళని తీసుకుంటే మొదటి పదిమందిలో RGV ఉంటాడు. తాను తెలివైన వాడినని, మిగతా జనం తనకంటే తెలివితక్కువ వారని, వారు ఆలోచించరని, ఇలా సాగుతాయి RGV మాటలు. మనకు ఈ మాటలు వినడానికి చాలా అసహనంగా ఉంటాయి. మన దృష్ట్యా ఈ విషయంలో RGV మోతాదు

చాలా మించిపోయాడు. మనకేమనిపిస్తుందంటే అంత స్వీయ ఆరాధన పనికి రాదని! మనకు సంబంధించని, RGVకి సంబంధిచిన మరికొన్ని స్వీయ ఆరాధన అలవాట్లు – నిద్రలేవగానే బ్లూ మువీలు చూడడం, కాంట్రవర్సీ సినిమాలు రక్తచరిత్ర, వంగవీటి లాంటివి తీయడం. సన్నీ లియోన్ షార్ట్‌ఫిల్మ్, గన్స్ & థైయ్స్ మొదలగునవి. వీరప్పన్, ఎన్.టి.ఆర్. సినిమాలు ఈ కోవలోకి రావు. గోవిందా గోవిందా సినిమా తీస్తున్నప్పుడు అందరూ జోళ్ళు లేకుండా వెంకటేశ్వర స్వామి విగ్రహం దగ్గర నటిస్తే, RGV మాత్రం షూలతోనే పనిచేశాడు. ఈ స్వీయఆరాధన లోంచి పుట్టుకొచ్చిన సినిమాలే 26/11, రాముడిని అడవికి పంపించే ముందురోజు రాత్రి కైకేయి, దశరథుడితో ఏం మాట్లాడి వుంటుంది, లాంటి దివ్యమైన ఆలోచనలు. RGV ఆడవాళ్ళని object of sex గా చూస్తున్నట్లు మాట్లాడతాడు. ఇది కూడా స్వీయ ఆరాధనే. నిజానికి RGV స్త్రీలోలుడు కాదు. స్త్రీలోలుడు అంటే కనపడిన స్త్రీని పొందడానికి దిగజారిపోయేవాడు. లేకి బిహేవియర్‌ని సంతరించుకునేవాడు. RGV లేకిగా ప్రవర్తించాడు అన్న ఒక్క ఉదాహరణ మనకు ఎక్కడా కనపడదు. అంటే నిప్పులేదు, పొగా లేదు.

RGV తెలివైన వాడని తనకి తానే చెప్పుకోవడం స్వీయ ఆరాధనలోకి వస్తుంది. అలాగే ఎక్కువ సార్లు ఏదో ఒక వంకతో టివిలో కనపడటం కూడా స్వీయ ఆరాధనే (అంటే అద్దంలో చూసుకున్నట్లు). అయితే ఆ వంక తాను సృష్టించుకున్నదా లేక అదే వొచ్చిందా అన్నది వేరే విషయం.

ముంబాయ్‌లో RGV ఆఫీస్ చూస్తే అతని స్వీయ ఆరాధన మనకు

అర్ధం అవుతుంది. ఒక తలుపుమీద హిట్లర్ పేరు. మరొక తలుపుమీద porn actress పేరు. గాంధీ పేరు కూడా ఒక తలుపు మీద వుంటుందని మరచిపోకూడదు.

ఫైనల్‌గా మనం గమనించవలసింది, RGV తన స్వీయ ఆరాధనను తనకు లాభదాయకంగా వాడుకుంటాడు. ఉదాహరణకు 26/11, NTR సినిమాలు. RGV నుండి మనం నేర్చుకోవలసింది, తనకున్న కాంప్లెక్స్, వీక్‌నెస్‌గా మారకముందే, అందులోంచి లాభం లాక్కుంటాడు. అప్పుడు ఆ కాంప్లెక్స్, వీక్‌నెస్‌గా మారదు. మనకు మోడీ గారు స్వచ్ఛ భారత్ అని కొంతకాలం గెంతేరు. టాక్స్‌లు వేయడంలోనూ, టెండూల్కర్‌ని పిలవడంలోనూ చూపిన ఇంట్రెస్ట్, నిజంగా భారత్‌ను ఇసుమంతైనా స్వచ్ఛంగా చేయడంలో చూపించలేదు. మాటవరసకి, ఇప్పటికి మోడీ స్వచ్ఛ భారత్ అంటూ, అదే ప్రధానమైన విషయం అని అంటూ ఉంటే మనకు చికాకుని, నీరసాన్ని ఇస్తుంది. లక్కీగా మోడి గారు స్వచ్ఛ భారత్ బాట తగ్గించేరు. నార్సిసిజం చూపెట్టలేదు.

– : o : –

## 6. అహం లేనట్లే !

ఇద్(Id) అనే లాటిన్ పదం నుంచి ego పుట్టింది. Ego అంటే unconscious instructional force ఈ అహం నూటికి నూరు మందికి ఉంటుంది. నేను అనే పదంలోంచి ఈ అహం ఉద్భవిస్తుంది. మనం జీవితంలో ఇంకా ఉన్నతంగా ఎదగాలి అంటే ఈ రోజు నుంచి నేను అనే పదం వదిలేయాలి? నేను మంచివాడిని, నాకు కోపం, నాకు బోర్‌కొడుతుంది, నేను స్వార్థపరుడిని, గతం గురించి చెబుతూ 1996లో ఇలా జరిగింది (ఇందులో కూడా నేను దాగి ఉంది) ఇలా ప్రతి వాక్యంలో నేను ఉంటుంది.

నేనుని వదలివేయడం అసంభవం. RGV కి అహం లేనట్లే! ఒక వ్యక్తికి అహం లేకపోవడం కూడా ఒక అహమే. అందుకే RGV కి అహం లేనట్లే అని అన్నాను. RGV – నేను అని తరుచుగా వాడతాడు. ఉదాహరణలు చెబుతాడు. అంటే గతంలోకి తొంగి చూస్తున్నాడు. ఇవన్నీ అహంలోకే వస్తాయి.

ప్రతి మనిషికి నాలుగు ఆత్మలు ఉంటాయి. ఆత్మన్యూనత(inferiority), ఆత్మవిమర్శ(self criticism), ఆత్మతృప్తి(self satisfaction), ఆత్మవిశ్వాసం(self confidence). పై నాలుగు ఆత్మలలో న్యూనత, తృప్తి బాగా తక్కువ ఉండాలి. ఆత్మవిమర్శ, ఆత్మవిశ్వాసం ఎక్కువ ఉండాలి. ఈ నాలుగు ఆత్మలలో ఏదీ జీరో ఉండకూడదు. ఉదాహరణకి ఆత్మ న్యూనత జీరో ఉంటె, మనం బట్టలు లేకుండా తిరగడానికి సంకోచించం. ఈ ఆత్మలు ఉండవలసిన శాతాలు inferiority, self satisfaction రెండు శాతాలు, self criticism, self confidene 48 శాతాలు. RGV కి న్యూనత, తృప్తి చాలా తక్కువ. మనందరికి

RGV కంటె అహం ఎక్కువ. డబ్బు సంపాదనకే మనం పని చేస్తాం. కొంచెం డబ్బు నష్టం రాగానే విలవిలలాడతం. సుమారు 50+ సినిమాలు ఫ్లాఫ్‌ల విజేత RGV. అతని స్థానంలో మనల్ని ఊహించుకుంటె, ఇన్ని ఫ్లాపుల తరువాత మనం బ్రతికి ఉండగలమా? మీడియా ముందు గొంతు వణకదూ? inferiority, satisfaction లేకపోవడం వలనే (ఉండవలసినంత ఉన్నాయి) RGV ఇంకా నిలబడగలుగుతున్నాడు.

RGV తన దగ్గర పనిచేసే వాళ్ళందరితో చాలా మర్యాదగా ఉంటాడు (అహం లేకపోబట్టే). విసురుగా ఒక్కమాట కూడా అనడు. RGV – నేను అనే మాట ఎక్కువ వాడతాడు. అయినప్పటికి ఆత్మ విమర్శ కరెక్ట్‌గా చేసుకుంటాడు. కాబట్టి, చాలా కాంప్లెక్స్‌లని జయించగలిగేడు. ఒక మనిషి తనకున్న ఏ ఒక్క బలహీనతని జయించలేడు. ఉదాహరణకి – ప్రొద్దున్న నిద్రలేవడం, వాకింగ్ చెయ్యటం, ఫోన్‌లో గట్టిగా మాట్లాడటం, తిండి తగ్గించటం ఇలా ఒకటేమిటి? కాని RGVకి అహం లేదు కాబట్టి, డేంజరస్ బలహీనతలు తిండితినడం, డబ్బు మీద ఆపేక్ష మొదలగునవి తగ్గించుకోగలిగేడు. ఇవి సామన్యమైన విషయాలు కావు. మనం ఈ రెండిటిని తగ్గించుకోగలిగితే మన జీవితం చాలా సుందరంగా తయారౌవుతుంది.

RGV కోర్ లెవల్ వరకు వెళ్ళి ఆత్మవిమర్శ చేసుకోగలడు కాబట్టే, అహం అనేది లేదు. అహం లేకపోతే కోపం, టెన్షన్, బిడియం లాంటి నెగిటివ్ ఎమోషన్స్ దూరంగా పారిపోతాయి. మనమూ ఆత్మవిమర్శ చేసుకుంటాం. కాని ఎలా చేసుకుంటాం? నేను చాలా మంచి దొంగని.

దొంగతనం చేస్తానుకాని, హింసకు పాల్పడను. ఇలా ఉంటాయి మన ఆత్మవిమర్శలు. లంచం తీసుకుంటాను కాని, ఎవరిని సతాయించను. ఇందులో కోర్ వరకు ఎక్కడ వెళ్ళాం?

– : ○ : –

## 7. RGV SUCESSFUL ఆ(

దీనికి నా సమాధానం అవునని, కాదని. RGV ప్రతి నిమిషాన్ని ఆస్వాదిస్తూ బ్రతకడం సక్సెస్‌ఫుల్. అలా వుండటం చాలా గ్రేట్. గత 25 సంవత్సరాల్లో RGV తన వర్క్‌కి బ్రేక్ తీసుకోలేదు. అంటే పనిని ఎంతగా ప్రేమిస్తున్నాడో! రోజుకి 4 – 5 గంటలుమాత్రమే నిద్రపోతాడు. అంటే రోజులో మిగిలిన సమయమంతా బోర్ కొట్టకుండా ఆస్వాదిస్తున్నాడన్నమాట. మనకు ఆదివారాల సాయంత్రాలే బోర్ కొట్టేస్తాయి. జిడ్డుగా సాగుతాయి. RGV ఫిలసాఫికల్ గా సక్సెస్‌ఫుల్, తాను నమ్మింది జీవితంలో అవలంభిస్తాడు.

శివ సినిమా హిట్ అవ్వడం మన అదృష్టం. కానీ RGV దురదృష్టం. శివ హిట్ అవ్వక పోయి వుంటే RGV ఇంకో హిట్ కోసం విశ్వప్రయత్నం చేసేవాడు. ఆ ప్రయత్నాలలో మరిన్ని శివలు వచ్చివుండేవి. కానీ, శివ హిట్ వలన మనకి చాలా మంది హిట్ డైరక్టర్‌లు వచ్చారు.

1990లో శంకరాభరణం వచ్చివుంటే క్లాసిక్ అయ్యేది కాదు. 1980లో శివ వొచ్చివుంటే డైరక్టర్‌ని ఎవరూ పట్టించుకునేవారు కాదు. సక్సెస్‌కి, ఫెయిల్యూర్‌కి టైం కూడా ఒక చలరాశి. అయితే RGV గొప్పతనం ఈ టైం గురించి పట్టించుకోకుండా సినిమా మీద ఇంట్రెస్ట్ కొద్దీ సినిమాలు తీస్తాడు. ఇది చాలా ఆరోగ్యకరమైన స్థితి. కాని RGV ఒక విషయం మరచి పోతున్నాడు. తన గ్రాఫ్, స్టెప్ ఫంక్షన్ లాగ పైకి ఎలా వెళ్ళడం అని తపన పడాలి. అంటే directorial merit ఉన్న సినిమా తీసేక (శివ, సర్కార్, కంపెనీ, 26/11.........), తరువాతది అంతే మేథాసంపత్తితో తీయాలి. RGV తన కొచ్చిన ఎమోషన్‌ని

సినిమాగా మలుస్తాడు. అందుకే RGV సినిమాలో human emotions చాలా ఘాటుగా వుంటాయి. జిరాక్స్ కాపీల్లాగా మొత్తం సంఘటనలు గుర్తుండి పోతాయి. అలా కాకుండా తనకొచ్చిన ఎమోషన్‌కి కొంత లేటెస్ట్ ట్రెండ్ కలుపుతూ, కొత్త టెక్నాలజీ ఉపయోగించుకొని, కొంత వేరేవాళ్ళతో discuss చేసి, అప్పుడు ప్రయోగం మొదలు పెట్టాలి, హిట్, ఫ్లాప్ మర్చిపోండి, వాటికి RGV అతీతుడు.

ఉదాహరణకి సత్య–2 చాలా మంచి చిత్రం. ఒక సత్య, ఆఫీస్ అనేది లేకుండా ప్రతి మనిషి దగ్గరకి మామూలుగా వెళ్తూ, తనకి కావలసిన పనులు జరిపించుకుంటాడు. రౌడీలకు, గూండాలకు ఇగో ఉండటం వలన ఏదో ఒక రోజు అర్ధాంతరంగా కాలం చేస్తున్నారు, నిజమైన డాన్‌కి ఇగో, కోపం, కక్ష ఉండకూడదు. ఇది బ్రిలియంట్ ఆలోచన (UBER taxi services లాగ). ప్రేక్షకులకి ఎందుకో కనెక్ట్ కాలేదు. ఇప్పుడు నేను ఏ వివరణ ఇచ్చిన అవుట్ పుట్ బయటకి వచ్చాక అందరూ బాగా అనాలసిస్ చెబుతారని RGV నన్ను ఆడిపోసుకుంటాడు.

గురువు గారికి నేను వ్యక్తిగతంగా ఒక సలహా. టోలెబ్ రాసిన Black Swan పుస్తకం చదవకపోయి వుంటే ఒకసారి చదవండి. కాబట్టి ఒక ఫెల్యూర్ సినిమా తీసి, మరియొక ఫెల్యూర్ తీసేలోగా, ఈమధ్యనున్న కాలం అంతా RGV సక్సెస్‌ఫుల్‌గా గడుపుతాడు. తన ఆలోచనా ప్రపంచంలో, తన వోడ్కాతో, తన స్త్రీ స్నేహితులతో, నిజానికి అతని గురించి మనం డిస్కస్ చేసి, మన టైంని అతని కోసం కేటాయిస్తున్నాం. డామిట్ కథ అడ్డం తిరిగింది.

RGV తనకి కావలసింది ఏమిటో తనకి తెలుసు. పాపులారిటీ! అందరూ తనగురించి మాట్లాడుకోవడం, దీనికి వాహనంగా సినిమాలు తియ్యడం ప్రారంభించాడు. మొదటి సినిమాతోనే చాలా ఎత్తుకి ఎదిగేడు. సినిమా హిస్టరీ పుస్తకంలో తన శివకి ఒక పేజీ సృష్టించుకున్నాడు. మెల్లిగా తన ప్రచోదనం తగ్గటం మొదలయ్యేసరికి హిందీకి మారిపోయాడు. అక్కడా తన సత్తా చూపించేడు. మెల్లిగా అక్కడ కూడా తగ్గటం మొదలయ్యేక, ట్వీట్స్ రూపంలో జనానికి బఠానీలు అందించేవాడు. దాంతో టీవి వారికి, యూ ట్యూబ్ వారికి టైం అమ్ముకోవడమే పని; తరువాత షార్ట్ ఫిల్మ్‌లు మొదలు పెట్టాడు. చివరగా గన్స్ & థైస్స్ రూపంలో web series మొదలు పెట్టాడు. ఆ web series ని పాపులర్ చెయ్యటానికి తనదైన శైలిలో ఒక స్త్రీని నగ్నంగా చిత్రీకరించాడు. నా guess work ఏమిటంటే, అట్రాక్షన్ కోసం నగ్నదృశ్యాలు పెట్టినా, మొత్తం web series విడుదలయ్యాక అందులో పెద్దగా ఏమీ సెక్స్ దృశ్యాలు ఉండవు. కేవలం సెక్స్‌తో తన సినిమాలు (web series) హిట్ చేసుకునే దుస్థితిలో RGV లేడు. 80 - RGV చిత్రాలలో ఫలానా సినిమా సెక్స్ కోసం మాత్రమే తీసిన సినిమా అని పేరుపడ్డ సినిమా ఒక్కటీ లేదు. అలాగే తన సినిమాలో అసభ్యకరమైన దృశ్యాలు (అబ్బా చూడలేకపోయాం), రేప్ సీన్‌లు, దాదాపుగా ఉండవు.

దీని బట్టి RGV స్త్రీలను, ప్రేక్షకులను ఎంత గౌరవిస్తాడో అర్ధం అవుతుంది. స్త్రీల తొడలను వర్ణించడం, వేరే వ్యక్తి యొక్క భార్యను ప్రేమించే వాడినని చెప్పడం – ఇవన్నీ నార్సిసిజంలోకి వస్తాయి. అలా చెప్పకుండా RGV ఉండలేడు.

RGV అనే వ్యక్తి కారణ జన్ముడు. ఎందుకంటే RGV లేకపోతే, ఇంతమంది సాధారణ వ్యక్తులు నటీనటులు, డైరక్టర్లు, నిర్మాతలు ఇండస్ట్రీలో అవతరించేవారు కాదు. సినిమాని సాధారణ వ్యక్తి అందుకునే సాదనంగా RGV ఏమీ కాకుండా నిరూపించాడు.

అలాగే కొత్త టెక్నాలజీని ఇండస్ట్రీలో మొదలు పెట్టడం RGV కే సాధ్యం అయ్యింది. నా అభిప్రాయం – ఇది RGV గ్రేటెస్ట్ అచివ్‌మెంట్ – ఓ సాధారణ గృహ కెమేరాతో దొంగల ముఠా తియ్యడం.

సినిమాని ఖరీదైన వస్తువుగా  నిలబెట్టడం కోసం, మిగిలిన వారంతా దగ్గరుండి తమకి తెలియకుండానే చిన్న కెమారా పట్ల ఇష్టత చూపెట్టలేదు. అందరూ చిన్న కెమేరా పట్టుకొని సినిమా ఫీల్డ్‌కి వొచ్చెస్తే, సినిమా చాట్ బండిలా తయారౌవుతుందని అందరి భయం. సినిమా ఖరీదుగా మిగిలిపోతే, తాము హిట్ అయితే పెద్దగా డబ్బు చేసుకోవచ్చు. ఈ రకంగా RGV – చిన్న కెమెరా ప్రయత్నాన్ని ఫ్లాప్ చేసేరు. ఫ్లో కేమ్‌లు, షార్ట్ ఫిల్ముల, రెండు లక్షల సినిమా, వెబ్‌సీరిస్ ఇలా అన్ని RGV సొంతం – వీటిని సక్సెస్ కాక మరేమని పిలవాలి.

అంతేకాదు సినిమా హిట్ అయితే తన ఒక్కడి ప్రతిభ అని ఏనాడు RGV చాటుకోడు. అందరి ప్రయత్నం వలన సినిమా హిట్ అయిందని అంటాడు. అయితే ఒక్కడిని పిలిచి అవార్డు ఇవ్వడం ఏమిటి అని నమ్రతగా అవార్డ్ తీసుకోడు, దాని గురించి చర్చించడు.

ఒక కాగితం మీద RGV బొమ్మ గీయించి, ఆ బొమ్మ లోపల ప్లస్‌లు,

మైనస్‌లు పెట్టుకొని పోతే, RGVకి ఎక్కువ ప్లస్‌లు, బహుతక్కువ మైనస్‌లు ఉంటాయి. మన ఇగో RGV satisfy చేయటం లేదని, ఆ మైనస్‌లు గురించి మాత్రమే మనం ఎలుగెత్తి అరుస్తాం. మీదపడి కరిచేస్తాం.

RGV ఇక నుండి ఎటువంటి సినిమాలు తియ్యాలి? RGVతో పని చేసిన నటులు, డైరక్టర్లు – తమకి RGV కి చాలా గ్యాప్ ఉందని, RGV అంత ఎత్తుకి ఎదగ లేమని (ideology లో) RGV కి సలహా ఇవ్వరు. ఒక CM కి మనమేం సలహా ఇస్తామని! RGV థింకింగ్ డైమెన్షన్ మార్చుకోవాలి. సృజనాత్మకమైన హాస్యం కోసం RGV ఆలోచించాలి. శివ సినిమాలో కాలేజీ కుర్రాల్ల మధ్య హాస్యం ఉండడానికి వీల్లేదని కరాకండిగా చెప్పాడు. ఉదాహరణకు క్షణం క్షణంలో శ్రీదేవి – వెంకటేష్‌ని ఉద్దేశించి – ఆ గన్‌లో బులెట్లు లేవుగా అని అంటుంది. అదే సినిమాలో ఈ అడవిలో బ్రిడ్జి ఎవరు కట్టేర్రా అన్న డైలాగ్. హాస్యం సినిమా యొక్క టెంపోని దెబ్బ తీస్తుందని RGV భయం. కాని సృజనాత్మకమైన హాస్యం, టెంపోని పెంచుతుంది.

RGVకి రెండవ సలహా తన కథల్లో డైమెన్షన్‌ని మార్చాలని. ఎప్పుడో గోవిందా గోవిందా సినిమాలో నాగార్జున అంటాడు. పుణ్యం రావాలంటే దేవాలయం దగ్గరనున్న కొలనులో స్నానం చెయ్యడంతో పాటు, కొన్ని మంచి పనులు కూడా చెయ్యాలని. నేను సొసైటీకి ఏమైనా చెప్పాలంటే whatsapp చేస్తానని RGV అంటూ వుంటాడు. తన లాజిక్‌తో, తన డీప్ థింకింగ్‌తో, ప్రజ్ఞా పాటవాలుతో RGV తననుకున్న సినిమా తీస్తూ, చిన చిన్న SMS లు సినిమాల్లో జోడించాలి. ఆ SMS లు సినిమాకి సంబంధం ఉండచ్చు,

ఉండకపోవచ్చు. ఉదాహరణకు ఒక యోగి నిప్పుల మీద నడిచి, ఇంటికి వచ్చి నిప్పులు కాలవని తన గ్రూప్‌కి విడమర్చి చెప్పడం లాంటివి. అంత stature ఉన్న RGV – కథను ఎన్నుకున్నప్పుడు – తన ఎమోషన్‌తో పాటు, తన ఎమోషన్‌ని తృప్తి పరచే మసాలా సంఘటనలు మరియు మెసేజ్‌లు చేర్చాలి. ఇది చదివి, రచయితా నువ్వు సినిమా తీసి చూపించు, నేను నీ అంత తెలివైన వాడిని కాదు, నీ అంత సైకాలజీ కూడా తెలియదు అని RGV అంటాడేమో!

– : o : –

## 8. గిరీశం మాష్టారు

గురజాడ రాసిన కన్యాశుల్కం లో (1892) గిరీశం ఒక ప్రాతపేరు. గిరీశం పాత్ర యొక్క క్యారక్టర్ ఎటువంటి దైనా చివరకు అతను ఒక విధవను వివాహమాడి ఆదర్శవంతమైన ముగింపు ఇస్తాడు. గిరీశం మంచి కోటేషన్స్ చెబుతూ ఉంటాడు. పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్ అన్నది గిరీశం కొటేషనే! గిరీశం చెప్పిన ఇంకో కొటేషన్ “నాతో మాట్లాడడమే ఒక ఎడ్యూకేషన్”. ఈ కొటేషన్ RGV కి సరిగ్గా సరిపోతుందని RGV ని గిరీశం మాష్టారని ఈ పుస్తకానికి పేరు పెట్టేను. మీరు చూడండి, RGV Interview ఏ ఐదు నిమిషాలు చూసినా, మనం ఏదో ఒకటి నేర్చుకుంటాం. మనం ఆచరించకపోవచ్చు. అది వేరే విషయం. కాని మనం చూడని లాజిక్‌ని RGV మనకి అందిస్తాడు.

ఓవరాల్‌గా RGV సినిమాలు హింస, ద్వేషం, పగ – ఈ బ్యాక్ డ్రాప్‌తో నడుస్తాయి. ఇటువంటి సినిమాలే RGV తీయడానికి కారణం – చిన్నప్పటి నుంచి లాజికల్‌గా ప్రశ్నించడం అలవాటు చేసుకున్నప్పుడు – సమాధానం రాదు. లాజిక్ బలవంతంగా ఎండ్ అయిపోతుంది. అప్పుడే వయలెన్స్ పుడుతుంది. సర్కార్ రాజ్‌లో Might is Right అనే డైలాగ్ అటువంటిదే. హైపవర్ ఏక్టివ్ అయిన పిల్లాడు RGV. అతని చిన్నప్పుడు పెరిగిన వాతావరణం, స్పోర్ట్స్ ఆడకపోవడం, ఇంట్లో (డబ్బు) కష్టాలు వీటి మీద మనకు పెద్ద ఇన్‌ఫర్‌మేషన్ లేదు. ఇంగ్లీషు టీచర్‌ని స్కూల్లో ఇష్టపడడంవలన బహుశ: ఇంగ్లీషు పికప్ చేసి ఉంటాడు. ఈ హైపర్ ఏక్టివ్ పిల్లలు ఎక్కువగా తమ ఆధిక్యత నిరూపించు కోవలనుకుంటారు. RGV –

చదువు, extra curricular activities లో పెద్దగా రాణించకపోవడం వలన, తన ఆధిక్య నిరూపణ గ్యాంగ్స్ మీద పెట్టి ఉంటాడు. అప్పటికే తన ప్రశ్నలకి లెంపకాయలే సమాధానలు గా వచ్చాయ్. కాబట్టే కరాటీ నేర్చుకుంటూ ఉండేవాడు. సర్కార్ లాగ సెటిల్ మెంట్స్ కూడా చేసే ఉంటాడు? (బహుశ: లగడపాటితో?)

మన పరిభాషలో RGV ఫ్యామిలీలైఫ్ స్పోయల్ అయ్యింది. దానికి తానే కారణం అని చెప్పుకుంటాడు. ఈ అతి తెలివైన వాళ్ళకి ఫ్రీడం పట్ల మక్కువ ఉంటుంది. తాను ఇష్టం వచ్చినట్లు తిరుగుతాను అంటే ఫ్యామిలీ లైఫ్‌లో దొబ్బదు. Obvious గా అదే friction కి మూలం అని మనకి అర్థం అవుతుంది. సోకాల్డ్ పెద్ద వాళ్ళు – చాలామంది – గాంధీ, ఐన్‌స్టీన్, స్టీఫెన్ హాకింగ్. మన తెలుగు సినిమా మహానటులు – వీరందరూ ఫ్యామిలీ లైఫ్‌లో ఫెయిల్ అయినవారే. Fail అంటే ఎంతసేపూ విడాకులు అని అనుకోవద్దు. RGV ఎప్పుడు తన ఆలోచనలతో, తన ప్రపంచంలోనే ఉంటాడు, ఫ్రీడం కోసం పరిగెడుతూ ఉంటాడు. అటువంటి వ్యక్తితో చివరి వరకు సహజీవనం చెయ్యడం దుర్లబం. RGV తో అసోసియేట్ అయిన మిగిలిన టెక్నిషియన్లు, నటులు ఎవరూ అతనితో ఇప్పటి వరకూ నిలబడలేదు. అందరూ జారిపోయారు. భార్య చట్టబద్ధంగా దూరమైంది, మిగిలిన వారు పిలిస్తే పలుకుతారు.

ఇక్కడ నా ఆలోచన కూడా తప్పే! సంఘపరంగా ఒకసారి పెళ్ళి అయితె, భార్యాభర్తలు విడిపోకూడదు అన్న బేస్ లైన్ దృష్ట్యా RGV ని అనలైజ్ చెయ్యడం పూర్తిగా నా తప్పు. భార్యలమీద, మేరేజ్ మీద ఇన్ని

లక్షల జోకులు వొస్తున్నా – అందరు మగవాళ్ళు పెళ్ళి చేసుకుంటున్నారంటే దాని అర్థం – వాళ్లకి కావలసింది కంచం, మంచం. మంచం అవసరం తగ్గగానే భార్యమీద జోకులు పుడతాయి. కన్యాశుల్కంలో గిరీశం కూడా అదే అంటాడు. దేవుడు ఆడవాళ్లకి నోరిచ్చింది – పెట్టుకుపడిపోడానికే. RGV భాషలో ప్రతి మ్యారేజ్ ఫ్లాపే! ఇక్కడ ఫ్లాప్ నిర్వచనం RGV కరెక్టగా చెప్పలేదు. కాని పెళ్ళి చేసుకొకపోతే వ్యక్తులు ఇంకా హాయిగా, ఆనందంగా ఉంటారన్నది నగ్న సత్యం. మరి పెళ్ళి చేసుకోకపోతే చట్టబద్ధమైన మంచం ఎలా దొరుకుతుందో?

ఫుడ్, డబ్బు విషయాల్లో, స్టూడెంట్‌గా ఉన్నప్పుడే పరిపక్వత తెచ్చుకొని తనకి అమితమైన ఆనందం ఇచ్చేది పాపులారిటీ, అమ్మాయిలు అని గుర్తించాడు. ఇవి రెండిటిని సాధించడానికి వెహికల్ సినిమాలు. ఇక్కడ వెహికల్ కోసం సినిమాలు ఎత్తుకోలేదు. సినిమాలు ఇంట్రస్ట్ కూడా బలంగా ఉండడం వలన అది వెహికల్ అయ్యింది. ఒక మూడేళ్ల కుర్రాడు ఐస్‌క్రీం కొనమని అదే పనిగా ఏడుస్తున్నాడు. తండ్రి ఐస్‌క్రీం కొనలేదు. పది నిమిషాల తరువాత ఏడుస్తున్న పిల్లాడిని ఎందుకు ఏడుస్తున్నావని అని అడిగితె, గుర్తు లేదంటాడు. ఇక్కడ గిరీశం మాస్టారు నుండి మనం నేర్చుకోవలసింది మనకి ఏమిటి కావాలో తెలిస్తే లేదా గుర్తువుంటే సగం సమస్య తీరినట్టే.

RGV కి ఎమోషనల్ ఇంటిలిజన్స్ ఎక్కువ. అందుకనే తనకు కలిగిన కోప, తాపాలను తన లాభానికే వాడుకుంటాడు. మనం కూడా ఇవి ప్రాక్టీసు చేస్తే బావుంటుంది. తాను ఎంతో మనసు పెట్టి తీసిన సినిమాలని తెలుగువారు హిట్ చెయ్యలేదని ప్లస్ తెలుగులో తన మార్కెట్ సైజు తగ్గిపోతుందని,

కోపంతో హిందిలో అడుగుపెట్టేడు. దీనికి చాలా ధైర్యం, నమ్మకం, తెగింపు కావాలి. రిస్క్ తీసుకోలేనివాడు డబ్బు, పేరు సంపాదించడానికి అనర్హుడు.

మన మీద మనకి, అయితె తక్కువ, లేదా ఎక్కువ విశ్వాసం ఉంటుంది. అందుకే మనం గవర్నమెంట్ ఉద్యోగాలకోసం చూస్తాం. కరెక్ట్ విశ్వాసం కలిగిన RGV అనుభవం లేకుండానే శివ లాంటి అద్భుతమైన సినిమా తీసేడు. మన మీద మనకు అర్జెంట్‌గా పరిపూర్ణ విశ్వాసం రావాలంటే, వాకింగ్, యోగా, మెడిటేషన్ (దేవుని స్మరించడం కాదు) ఏదో మొక్క బడిగా లేదా డ్యూటిగా చేయ్యకుండా, మనస్ఫూర్తిగా చెయ్యాలి.

దేశభక్తి, దేవుడు, బాబాలు, జోతిష్యం, కులం, మతం – ఇవన్నీ మామూలు విషయాలు. సాధారణ జనంకంటె, ఒక్క మెట్టు పైన ఆలోచించే వాడికి, ఇవేవి పట్టావు. మన ఆలోచనలు అయితే మెట్టు మీద ఉంటాయి. లేదా మెట్టు క్రింద ఉంటాయి. అందుకే పై విషయాల గురించి పిసికేసుకుంటాం. జాతీయగీతం వచ్చినప్పుడు తాను (mostly) నిలబడనని అంటాడు RGV. ఇది స్వీయ ఆరాధన క్రింద వస్తుంది. నిలబడకపోతే జాతీయగీతాన్ని అవమానించినట్లు, ఇది తప్పు, పాపం, RGV జీవితం పాపపంకిలం అయిపోతుంది – దయచేసి ఇలా ఆలోచించవద్దు. మనందరం మన స్థాయిలో ఏదో ఒక విధంగా దేశాన్ని, జాతిని అవమానిస్తున్నాం. కాదంటరా? దేవుడికి దక్షిణవేసి అర్హతలేని వస్తువు కోసం ప్రార్థించే వాళ్ళు ఉన్నంతవరకు ఈ జాతి ముందుకు ఎలా వెళ్తుంది? నేను కాదు సుమీ.. అని అనుకోండి.

మనందరికి చావు అంటె తొంబై శాతం భయం ఉంటుంది. RGV మెల్లిగా ఆ భయాన్ని పది శాతానికి తగ్గించుకున్నాడు. ఆ భయాన్ని వదిలించుకోవడానికి, దెయ్యం సినిమాలు తీస్తున్నాడు. చూడండి తన భయాన్ని తన లాభం కోసం ఎలా వాడుకున్నాడో! తద్వారా మనకి కొన్ని మంచి సినిమాలు వచ్చాయ్. డబ్బు పట్ల మక్కువ, లేదు కాబట్టే, భవిష్యత్తు గురించి భయపడడు. అంటే చావు భయం పది శాతానికి దిగిపోయిందన్న మాట. మనకున్న భయాలు గుర్తించి, వదిలించు కోవడానికి try చేద్దామా? చాలా ప్రశ్నలకి సైన్స్ ఇంకా సమాధానం చెప్పవలసి ఉంది. కాబట్టి RGV కి తనటొపోబియా పదిశాతం దగ్గర ఆగిపోయింది లేకపోతే జీరో దగ్గరకి వొచ్చేది.

ఫైనల్‌గా RGV తెలివైన భయస్తుడు, దేవుడిని విమర్శిస్తున్నప్పుడు ఎంత సేపూ బాలాజీ మీద పడతాడు కాని, అల్లాని, జీసస్‌ని షూటుగా విమర్శించడు. Whatever అని తప్పించుకుంటాడు. లేదా x = అని మనల్ని ప్రతిక్షేపించుకోమంటాడు. ఫ్రీడం అంటె మక్కువ ఉండటం వలన ఈ విషయంలో RGV చాలా జాగ్రత్త పడతాడు. లేకపోతే ఏ రష్డీ లాగో అసైలంలో బ్రతకాలి... RGV గారు రైటేనా?

**ముగింపుగా**

సైన్స్‌కి తనకి ఎంత **తెలుసో** తనకి తెలుసు.

సైన్స్‌కి తనకి ఎంత **తెలియదో** తనకి తెలుసు

మతానికి తనకి ఎంత **తెలుసో** తనకి తెలియదు.

మతానికి తనకి ఎంత **తెలియదో** తనకి తెలియదు.

కాని మతం **'నేనున్నాను'** అని అన్నింట్లో దూరిపోతుంది.

– : o : –




| | | |
|---|---|---|
| Name | : | **Ravi Kishore Mallapragada** |
| E-Mail | : | ravikishorem@yahoo.com |
| Whatsapp | : | +966501446104 / +918074897131 |
| Qualification | : | Ph.D. Mathematics |
| Working | : | Asst. Professor, Yanbu Industrial College, Saudi Arabia |
| Interests | : | Psychology, Movies, Music, Travel |
| Previous Books | : | 1. Is job injurious to Wealth? (Telugu) |
| | | 2. Money Management (Telugu) |
| Living at | : | Visakhapatnam |
| Genre | : | Personality Development |